# గ్రంథాలయసర్వస్వము.

| సంపు. ౧. | బెజవాడ - ఫిబ్రవరి ౧౯౨౯. | సంచిక. ౧. |
| --- | --- | --- |

## ఆంధ్రగ్రంథాలయములకు ప్రభుత్వము వారు చేయవలసిన సహాయము.

(1) సంచార గ్రంథాలయ పేటికల మూలమున ప్రజలయందు విద్యాభివృద్ధి చేయుట.

(2) స్థాయి గ్రంథాలయములకు ఎక్కువ విరాళములనిచ్చుట.

(3) ప్రజాసామాన్యమునందు విద్య వ్యాపించుట కుపయుక్తమగు మార్గముల నన్వేషించుట, ఆ మార్గముల మూలమున ప్రజలను జ్ఞానవంతులుగా చేయుట.

(4) గ్రంథాలయములను స్థాపించుటకుగాను స్థానికసంఘములకు ధనసహాయము చేయుట.

(5) విద్యాశాఖకు చెందిన ఉద్యోగస్థులమూలమున మ్యాజిక్కు లాంతరు, బొమ్మల కార్డులు - మొదలగు ఉపకరణముల సహాయముతో. ప్రజలయందు జ్ఞానాభివృద్ధి చేయుట.

(6) బడులలో విద్య నభ్యసించుటకు మించిన ఈడుగల వారల విద్యాభివృద్ధియొక్క అవసరావశ్యకతలను గూర్చి ప్రజలయందు ప్రబోధము కావించి ప్రజలను జ్ఞానము సంపాదించుకొనునట్లు పురికొల్పుట.

(7) రిజష్టరు చేయించుకొనుటకు కోరే గ్రంథాలయ సంఘములనుండి ఫీజు పుచ్చుకొనకుండగనే రిజష్టరు చేయుట.

(8) పాఠశాలల భవన నిర్మాణముకొరకు ప్రభుత్వమువారు గ్రాంటును ఎట్టి నియమములతో నిచ్చుచున్నారో అట్లే గ్రంథాలయ భవనములకు కూడ గ్రాంటుల నిచ్చుట.

# అఖిలభారత గ్రంథాలయ మహాసభ.

ఆహ్వానసంఘాధ్యక్షులగు రవీంద్రనాథఠాకూరుగారి యుపన్యాసము:

సేకరించుటయందు పేరాస:

అత్యాశ మానవుని ముఖ్యమగు అంతశ్శత్రువులలో నొకటి. అతడు ఒకసారి, సేకరించి నిలువజేయుటకు ప్రారంభించుచో- సంఖ్యను హెచ్చించుతలంపున కూడబెట్టుటయందుగల పరమార్థమును మరచి పోవును. అతడు తనధనాగారమునకు ధనము ప్రోవుజేయుచున్నను, తన తెగను విస్తరింపజేయుటకుగాను మనుష్యులను కూడదీయుచున్నను- ప్రోగుజేయవలయుననెడి యుత్సాహప్రవాహమునబడి కొట్టుకొని పోవును. అప్పటి గుడ్డితొందరలో ఆతని ఆశయమగు నవధి కళంకిత మగును. ఏ సత్యముయొక్క విలువనుగాని అందున్నవస్తువుల సంఖ్యా బాహుళ్యముచేత నిర్ణయింపరాదని ఆతనిమనస్సు మరచిపోవును.

సంఖ్యాబాహుళ్యము:

విశేషగ్రంథాలయములను ప్రోగుచేయుతృష్ణ పీడించుచున్నది. ఆ గ్రంథాలయములలో ముప్పాతిక వంతు పుస్తకములను ఎవ్వరును ఉపయోగింపరు. అనుపయోగ గ్రంథములు అమితముగా పెరిగిపోవుట వలన, ఉపయోగార్థము ఉద్దేశింపబడిన కొద్ది మంచిగ్రంథములుగూడ మూలబడిపోవుచున్నవి. జనసామాన్యముయొక్క వాడుకలో ధన వంతుని గొప్పవాడందురు. ఒకకోటీశ్వరుడు ఏదేని సమావేశము నకు వచ్చెనని ఒకరినిమించి మరియొక రాతనిని గౌరవించుటకై పోటీపడుదురు. ఆగౌరవము, ఆతడు ఒసంగవలసిన దానిపైనగాక కేవల మతని కున్నదానిపైననె నిలుచును. ఈవిధమున చాలవరకు గ్రంథాలయముల గొప్పదనము గ్రంథముల సంఖ్యవలననే నిర్ణయింప బడుచున్నది. ఒకగ్రంథాలయమందలి పుస్తకములు ఉపయోగించుటకు గల సౌలభ్యములే ఆగ్రంథాలయమునకు ప్రతిష్ఠను గూర్చవలసి యుండ, అట్టిసౌలభ్యములు అవసరములని గ్రంథాలయములచే పరి గణింపబడకున్నవి.

మనభాషయందలి పదజాలములు రెండుతావుల కానవచ్చును. మొదటిది నిఘంటువు. రెండవది సారస్వతము. ఒకభాషయందు వాడుకలోనుండుపదములు కొద్దిగానుండునప్పటికిని, ఒకపెద్దనిఘంటువు నందుమాత్రము ఆభాషయందలి పదజాలము నంతను సేకరించుట ఉపయోగకరమైనది. కాని సారస్వతమునందలి పదజాలము మిక్కిలి తక్కువ. అందున్న పదములు సజీవమైనవి. అందుచేత సారస్వతమునందలి ఒక్కపదమునైనను విడువజాలము. అయినను నిఘంటువునకంటె సారస్వతమునకే ఎక్కువ విలువయని అంగీకరింపకతప్పదు.

ఈసత్యమే గ్రంథాలయములయెడల గూడ అన్వయించును. గ్రంథాలయమందు బహుగ్రంధసముపార్జనార్థమయిన భాగము ఉపయోగకరమైనదియే; కాని నిరంతరము అనేకవిధముల ఉపయోగించుటకై ఏర్పడిన రెండవభాగము గ్రంథాలయముయొక్క మహత్వమును నిర్ణయించును. సామాన్యముగా గ్రంథభాండాగారి తనగ్రంథాలయమందలి గ్రంథములలో ఎక్కువగ్రంథములు ఉపయోగింపబడునటుల శ్రద్ధను దీసికొనకపోవుటయేగాక, ఆవిషయమును తనతలంపునకుగూడ దీసికొనిరాడు. ఏలయన, సంఖ్యాబాహుళ్యమును ప్రదర్శించి, లోకమును ఉక్కిరిబిక్కిరి చేయుట ఎల్లప్పుడును సులభము.

ఉపయోగకరమార్గములు:

ఒకగ్రంథాలయమును సంపూర్ణ ఉపయోగమునకు దేవలెనన్న, అందున్న గ్రంథములనుగూర్చి అందరికి స్పష్టముగా వెల్లడిజేయవలెను. అట్లుచేయకున్న సామాన్యజనులకు అవి అందుబాటులో నుండవు. గ్రంథాలయము అప్పుడు ఎక్కువ వసతికలిగియు, రాకపోకలకు సౌకర్యములేని నగరమువలె విడిచిపెట్టబడును. ఏదేని ముఖ్యాన్వేషణతో తరుచు గ్రంథాలయమునకు వచ్చుచుండువారు తమ ఆవశ్యకతయొక్క తొందరనుబట్టి, తమంతటతామే దారిచేసికొందురు. ఈవిషయమునందు తనకుగలబాధ్యతను గ్రంథాలయమే గుర్తింపవలెను. గ్రంథాలయమందు గ్రంథము లున్నందులకు ఫలితముగ వానిని అందరిచేతను చదివింపవలెను. అప్పుడే గ్రంథాలయమునకు సార్థకత

పర్చకును. కేవలము జనులను పుస్తకములను చూచిపోవుటకు రానిచ్చుట మాత్రముచాలదు. పుస్తకములు చదువుటకు ఆహ్వానము జనులను ఆకర్షించునదిగ నుండవలెను. "తన్నష్టం యన్నదీయతే" ఇవ్వబడనిది వ్యర్థమైన దానితో సమానము.

"ఇదిగో గ్రంథములజాబితా, రండి పుస్తకముల నేరుకొండి" అని చెప్పుట గ్రంథాలయములయందు పరిపాటి. కాని ఈగ్రంథముల జాబితాలందు-గ్రంథములను పరిచయము చేయుటగాని, చదువరిని ఆహ్వానము చేయుటగాని స్వాగతోత్సాహములుగాని లేవు. తానిచ్చు విందుతో పాఠకుల నాహ్వానించుటకు ఏగ్రంథాలయమెక్కువ ఆతురతనుజూపునో అదియే ఆతిథ్యపరత్వము కలది. ఇట్టి ఆతిథ్యము మాత్రమే గ్రంథాలయమును పెద్దదానినిగా జేయును గాని, గ్రంథముల సంఖ్యగాదు. పాఠకులు గ్రంథాలయమును పుట్టింతురనునది సంపూర్ణ సత్యముగాదు; గ్రంథాలయముకూడ పాఠకులను సృష్టించును.

గ్రంథభాండాగారికవిధ్యుక్తధర్మము.—

ఈపరమార్థము దృక్పథమందు నిలుపుకొన్నచో, గ్రంథభాండాగారి నెరవేర్పవలసిన విధ్యుక్తధర్మ మెంతగొప్పదియో తెలసికొనగలము. గ్రంథములను సేకరించి విషయ విభాగముచేసి, వానిని జాగ్రత్తపెట్టుటతో ఆతనిధర్మము ముగియదు. అనగా పెంచుట, విభాగించుట-వీనివలన మాత్రము ఆతని ముఖ్యధర్మము నెరవేరలేదు. గ్రంథములనన్నింటిని ఆతడు పరిచయము చేసికొనియుండవలెను. గ్రంథాలయము పెద్దదైన యెడల అందలి గ్రంథములనన్నింటిని సరిగా నర్థము జేసికొనుట ఆతనికి అశక్యముకాగలదు. అందువలన పెద్దగ్రంథాలయము ఉగ్రాణము వంటిది. కాబట్టి భోజనశాలవలె దినదినమును ఆహారమును, ఆనందమును సమకూర్చునది చిన్న గ్రంథాలయము మాత్రమేను.

చిన్నగ్రంథాలయము:

చిన్నగ్రంథాలయము ఇట్టిది: అందు ప్రతివిషయమునందును ముఖ్యగ్రంథములుమాత్రముండవలెను. ఆగ్రంథములు సంఖ్యాబాధ

నకు గాక ఒక్కొక్కటియు ప్రత్యేకాధిక్యమును కలదిగానుండవలెను. అందు గ్రంథభాండాగారి నిరుద్దేశపూర్వకమగు అర్చనాశక్తికలిగి, గ్రంథాలయమును కేవలము నిండించుటయందే అభిమానములేక, వాస్తవముగ అనవసరములగు పుస్తకములను విసర్జించు వివేచనశక్తిని కలిగియుండవలెను. దానియొక్క గ్రంథభాండాగారికి గృహమేధి గుణము లుండవలయును. కాని ఉగ్రాణపు కావలివాని గుణము లుండ కూడదు.

ఉదాహరణము:

స్వదేశమందును విదేశములందును ప్రకటింపబడు పత్రికలను తెప్పించుచున్న ఒక గ్రంథాలయమును ఉదాహరణనిమిత్తము తీసికొందము. ప్రతిపత్రికలో ప్రత్యేక మాకర్షవంతములగు వ్యాసములను ప్రత్యేక మొకగ్రంథాలయ నిర్వాహకుడు ఎల్లప్పుడును పరిశీలించుచు, అట్టివిషయములపట్టికను వ్రాసి అందరికిని వెల్లడియగు స్థలము నందు ఉంచినచో, ఆపత్రికలను అనేకులు పఠించు నవకాశములు అమితముగ పెరుగునగదా. అట్లుకాదేని, ముప్పాతికభాగము పత్రికలు తెరవబడకనేయుండి, అవి పెరిగినకాలదిసి బీరువాలకు భారమై ముదిగిపోవుచున్నవి. నూతనముగ బయలుదేరు గ్రంథములగతియు నిదియేను. గ్రంథభాండాగారిగాని, ఆతని సహకారులుగాని, గ్రంథాలయమందలి గ్రంథములందుగల విశేషములను తెలిసికొనుటకు ప్రయత్నింపరు. క్రొత్తగ్రంథములు గ్రంథాలయమునకు వచ్చినవెంటనే అందలి సారస్వతసంపద అందరికిని తెలియబరుపనక్కర లేదా!

తెలియబరుపవలసిన దెవరికి? ప్రతివిషయమును కొందరు ముఖ్య పాఠకులకు తెలియబరుపవలెను. అట్టి ముఖ్యపాఠకసంఘములు ప్రతి గ్రంథాలయమునకు అనుబంధముగా ఉండితీరవలెను. అట్టిపాఠకసంఘములే గ్రంథాలయమునకు జీవము. గ్రంథభాండాగారి సామర్థ్యము అనేకపాఠకసంఘముల నాకర్షించి, వానిని పరిరక్షించుటయందును, పాఠకునికిని గ్రంథములకును మధ్యస్థుడై పరిచయము హెచ్చించుట యందును గలదు. అనగా ఆతనిమీద గ్రంథములభారమేగాక, పాఠ

కుల భారముగూడ గలదు. ఈ రెండింటిని, నిపుణతతో నిర్వహించుట యందే ఆతనిసామర్థ్యము, ఆతనియందుంచిన విధినిర్వహణము నిర్ణయింపబడును.

గ్రంథముల పరిచయము:

గ్రంథభాండాగారి తాను సేకరించిన గ్రంథములను గూర్చియే గాక, అప్పుడప్పుడు వివిధవిషయములనుగూర్చి ప్రకటింపబడు గ్రంథములను గూర్చిగూడ తెలిసికొనియుండవలెను. దృష్టాంతరము: మాశాంతినికేతన పాఠశాలకు కావలసినపుస్తకముల నేర్చుకొనుటకుగాను, పిల్లలకొరకు ప్రకటించబడు పుస్తకము లన్నింటినిగూర్చి తెలిసికొనియుండవలయును. గ్రంథాలయములన్నియు ఇట్టిపనికి తోడ్పడవలెను. ఆయా విషయములయందు ప్రఖ్యాతిగన్న గ్రంథములపట్టికలను సేకరించుటవలన ఈపని కాగలదు. ఈకార్యనిర్వహణమునందు ఒక గ్రంథాలయము నిమగ్నమై యున్నటుల వెల్లడియైనచో, గ్రంథప్రకాశకులందరును క్రొత్తగ్రంథముల పట్టికలను వానివిషయవివరణములను పంపి, ఆగ్రంథాలయమునకు తోడ్పడుదురు.

అఖిలభారతగ్రంథాలయసభ:

తుదకు అఖిలభారత గ్రంథాలయసభకు నాదొక సూచనగలదు. ఆంగ్లేయభాషలో బయలుదేరిన ముఖ్యములగు వైజ్ఞానికసారస్వతచారిత్రిక గ్రంథములయొక్క జాబితాలను, మూడుమాసములకో-అర్థసంవత్సరమునకో-అథమము సంవత్సరమునకో-ఒకమారు తయారుజేసి ప్రకటించు విషయమునుగూర్చి ఈసభవా రాలోచింపవలెను. దేశమందంతటను గ్రంథాలయములను స్థాపించి, అభివృద్ధిపరచుట ఈ సభయొక్క ఉద్దేశమగునేని సేకరింపవలసిన గ్రంథముల మార్గదర్శికల నొసంగుట చేత, ఆయుద్దేశము సఫలముకాగలదు. గ్రంథసంపాదన గ్రంథరక్షణయు మాత్రమేగాక, గ్రంథాలయ ప్రధాన కార్యమగు గ్రంథపరిచయమునకును అప్పుడే సహాయముకాగలదు. గ్రంథము లందలి విషయములయందు కుతూహల మేర్పడగలదు.

# ఇంగ్లాండు దేశము - కేంద్రగ్రంథాలయములు.

ఇంగ్లాండు దేశమున కంతకును లండనునగరమువం దొకగొప్ప కేంద్రగ్రంథాలయము స్థాపింపబడినది. ఆ దేశమందున్న మారుమూలల నుండికూడ పల్లెగ్రంథాలయముద్వారా, ఎవరైన తనకు కావలసిన గ్రంథమును కేంద్రగ్రంథాలయమునుండి తెప్పించుకొనవచ్చును. ఈరీతిగా కేంద్రగ్రంథాలయమునుండి తెప్పించుకొను పుస్తకములసంఖ్య అమితముగ బెరిగిపోయినది. ఈ పెరిగిపోయిన అవసరమును అనగా 500 పల్లెటూరి గ్రంథాలయములకు కావలసిన గ్రంథములను సప్లయి చేయుటకు కేంద్రగ్రంథాలయమునకు సాధ్యముగాకుండెను.

ఇట్టిస్థితిగతులయందు ఏమి చేయదగునని ఆ దేశమందలి గ్రంథాలయముల ప్రతినిధు లందరును సమావేశమై యోచించిరి. పల్లెటూరి గ్రంథాలయమువారు ఖరీదు ఎక్కువనే కారణముచేతగాని, దానిని ఎక్కువమంది చదువరనే కారణముచేతగాని ఏదేని పుస్తకమును కొనజాలనియెడల, అట్టిగ్రంథమును కేంద్రగ్రంథాలయమువారు పల్లెటూరు గ్రంథాలయమునకు సప్లయి జేయవలసియుండును. ఇందులకై ఎక్కడెక్కడ జిల్లా కొక మండలగ్రంథాలయమును స్థాపించి, పల్లెగ్రంథాలయములు తమకుకావలసిన గ్రంథములను మండలగ్రంథాలయములనుండి తెప్పించుకొనుటయు, మండలగ్రంథాలయములు తమకు కావలసిన గ్రంథములను కేంద్రగ్రంథాలయమునుండి తెప్పించుకొనుటయు జేసిన బాగుండుననియు అందరికిని కావలసిన గ్రంథములు సులభముగా అందుబాటులో నుండుననియు నిశ్చయించిరి. ఇట్లు జేయుటవలన మండల గ్రంథాలయములు తమదగ్గర ఉపయోగింపకుండ వృథాగా నిలచియుండు గ్రంథములను ఉపయోగింపగలుగుటయు, కేంద్రగ్రంథాలయమువారు తమకు మండలగ్రంథాలయములవలన గలిగిన విశ్రాంతివలన తమ గ్రంథసముదాయము నభివృద్ధి జేసికొనగలుగుటయు సంభవమగును. దీనికిగాను మండలగ్రంథాలయముల పుస్తకములన్నిటిని కలిపి, ఒకే గ్రంథములపట్టికను తయారుజేసి, దానిని పల్లెటూరు గ్రంథాలయములన్నింటికిని, సప్లయి చేయుటవలన ఎవరికిగావలసిన పుస్తకములను వారు సులభముగా దెప్పించుకొనుటకు అందుబాటులోనుండును.

(1) ఒకతాలూకాలోగలగ్రంథాలయములన్నియుపరస్పరసహాయముజేసికొనుట. (2) పెద్దగ్రంథాలయము ఒకతాలూకాకుగాని, రెండుతాలూకాలకుగాని కేంద్రగ్రంథాలయముగ ఏర్పడుట. (3) పెద్ద పట్టణములందలి గ్రంథాలయములు మండలగ్రంథాలయములగుట. (4) వీటిఅన్నింటికిపైన కేంద్రగ్రంథాలయముండుట. (5) ప్రత్యేకవిషయిక గ్రంథాలయములు - ఈప్రకారము ఇంగ్లాండులో గ్రంథాలయములు ఏర్పడిన బాగుండునని నిర్ణయించిరి.

ఈప్రకారము ఏర్పడుటవలన కేంద్రగ్రంథాలయమును ప్రత్యేక విషయికగ్రంథాలయములును మండలగ్రంథాలయములకుతోడ్పడగలవు. మండలగ్రంథాలయములు తాలూకాగ్రంథాలయములకు తోడ్పడ గలవు. తాలూకాగ్రంథాలయములు గ్రామగ్రంథాలయములకు తోడ్పడ గలవు. ఇదిబాగుగవ్యాప్తమగుటకుగాను అన్నిగ్రంథాలయములకును గలిపి గ్రంథముల సమష్టిజాబితా నొకదానిని తయారుజేయుటయు, గ్రంథాలయముల పుస్తకములను పంపుటకుగాను, పోష్టలురేట్లను తగ్గించుటయు అత్యంతావశ్యకములు. ప్రభుత్వమువారి నిరంకుశపద్ధతికి లోనుగాకుండ స్వతంత్రపద్ధతిమీాధనే ఇట్టిపద్ధతి నడుపుట శ్రేయస్కరము.

వందలకొలది గ్రంథాలయములుగల ఆంధ్రదేశమందీపద్ధతిని నడపిన జయప్రదము కావచ్చును

—దాసు త్రివిక్రమరావు.

## శ్రీ దేశోద్ధారక ఆంధ్రభాషానిలయము: తుక్కునూరు.

ఈ మార్గశిర బ ౨, 3 లందు ఈనిలయ తృతీయ వార్షికోత్సవము బెజవాడ పురప్రముఖులును, అనేక శాస్త్రవిషయిక విమర్శక దక్షులు, పండితులు నగు శ్రీ చెరుకుపల్లి బుచ్చిరామశాస్త్రిగారి అధ్యక్షతక్రింద జయప్రదముగా జరిగెను. ప్రథమదినమున ప్రార్థనానంత

రము నిలయాధ్యక్షులు సభాసదులకు స్వాగత మొసంగిరి. సభాధ్యక్షులు పుష్పమాలాలంకృతులు గావింపబడిన పిమ్మట స్వాగతపద్యములు చదువబడెను. సభాధ్యక్షులు ప్రారంభోపన్యాస మొనరించిరి. ప్రముఖులు పంపినసందేశములు, ఆశీర్వాదపద్యములు చదువబడెను. పిమ్మట కార్యదర్శి ప్రభవ సం॥ర నివేదికను చదివెను. శ్రీవరహాగిరి వెంకటభగీరథిగారంపిన భావకుసుమావళి యను వ్యాసము చదువబడెను. ఆంధ్రజన సంఘ కార్యదర్శి శ్రీ. వెం. రా. ల. నా. శర్మగారు, "పాల్వంచ సంస్థానపూర్వప్రశస్తి - టిస్థితిగతులు-సంఘసంచలనము"ను గురించి తమ యుపన్యాసము నుడివిరి. రెండవదినమున సభాప్రారంభమున నిలయోపాధ్యక్షులు శ్రీసుబ్బారావుగారు తామురచించిన యాశీర్వాద పద్యములు చదివిరి. సభాధ్యక్షులు తమ అధ్యక్షోన్యాసము నొసంగిరి. పిమ్మట బ్రహ్మశ్రీ పండిత పట్టాభిరామశాస్త్రిగారు 'ఆంధ్రభాషాస్థితిగతులు' అను విషయమునుగూర్చి యుపన్యసించిరి. పిమ్మట శతావధాని దోమా వేంకటస్వామిగుప్తగారంపిన 'తెనుగుంగూర్చి విన్నపము' అను పద్యవ్యాసము చదువబడెను. సభాధ్యక్షులు కొంతవిమర్శనలతో భవన నిర్మాణమును, గ్రంథోపయోగమును గూర్చి హెచ్చరించుచు అంత్యోపన్యాస మొసంగిరి. సభాంతమున రాజమండ్రి వాస్తవ్యులు శ్రీ మామిడి బుచ్చయ్యగారు రు. 116 లు, నిలయ ప్రధానపోషకులు శ్రీ పలివెల సింగయ్యగారు రు. 116 లు భవననిర్మాణమునకు విరాళము లొసంగి ప్రోత్సహించిరి. స్థానికప్రముఖులు రు. 200లవరకు వాగ్దానము లొనరించిరి.

# గోపాలకృష్ణ గ్రంథాలయము- పొందూరు.

తే. ప్రథిత శ్రీ దుగ్గిరాలాన్వ♦వాయభవుడు
"ఆంధ్ర రత్నము" నా బిరు♦దాంకితుండు
కీర్తిశేషుడు, గోపాల ♦ కృష్ణయాఖ్యు
డనఘు డాతని స్మరియింతు ♦ నాత్మలోన.

తే. కాన మిట్టిగాన మింక జ♦గానఁ గాన
"అభినవ త్యాగరా" జను ♦ నట్టి బిరుద
మితనికేఁ జెల్లు నని ప్రజ♦లెల్ల వాగడఁ
బ్రబలె నే ఘనుఁ డతని నేఁ ♦ బ్రస్తుతింతు.

సీ. తనజీవితము రామ♦ధరణీశుసేవకై
ధారవోసిన మహా♦ధార్మికుండు
తనవాక్చమత్కృతి ♦ జనముల నలరింప
దీక్షఁ గైకొనిన యు♦దీర్ణగుణుఁడు
తనశక్తి భారతా ♦ వనినెల్ల దిక్కుల
వ్యాపింపఁ జేసిన ♦ ప్రథితచణుఁడు
తనయార్జితధనమ్ము ♦ ననయమ్ము బీద సా
దల కొసంగిన యశో♦ధన విభుండు

తే. అట్టి శ్రీకరుఁ డాంధ్ర♦త్యాగాభిధానుఁ
డైన గోపాలకృష్ణయా♦ఖ్యానువర్తి
తమగు గ్రంథాలయమును సం♦తతము బ్రోచు
గాత గోపాలకృష్ణుండు ♦ కరుణతోడ.

శా. కారాగారనివాసకాలమున లో♦కఖ్యాతునిన్ రాము నెం
తే రమ్యంబుగఁ బ్రస్తుతించుటను గా♦దే? "రామదాసుం"డనన్
బేరన్ బిల్వ బడెంగె, నట్టి యనఘున్ ♦ విద్యాధికున్ గృష్ణు స
త్పేరన్ స్థాపిత పుస్తకాలయమి దె♦వ్వేళన్ జయంబొందెడిన్.

మ. కలుగుం గావుత సౌఖ్యమాతనికి స్వా♦ర్గంబందుఁ, దత్ప్రేరునన్
లలి గ్రంథాలయ మొండు నిల్పిన జన♦వ్రాతంబు నెంతేఁ గృపా
కలనన్ గృష్ణుఁడు బ్రోచుగాత, మఱి త♦ద్గ్రంథాలయం బెప్పుడున్
బలు పొత్తంబులచేతఁ బత్రికలచే ♦ భాసిల్లి వర్ధిల్లుతన్.

— తెన్నేటి నారాయణశర్మ (కవిమండలి)

# హిందూయువజన సంఘము-ఏలూరు.

ఈగ్రంథాలయముయొక్క నూతనభవనప్రవేశ మహోత్సవము 10-2-29 తేదీన మహావైభవముగా జరిగినది. నాడుప్రాతఃకాలమున మార్జోరీబ్యాంక్సు దొరగారు నూతనభవనమును దెరచి, తదుపరి నూనెరంగులతో వ్రాయబడిన శ్రీ శ్రీ మోతే గంగరాజు జమీందారుగారి పెద్దపటమును బహిర్గతముజేసిరి. మధ్యాహ్నము శ్రీ సూరి వేంకటనరసింహశాస్త్రిగారి అధ్యక్షతక్రింద గొప్పసభ సమావేశమయ్యెను. శ్రీ దాసు త్రివిక్రమరావుగారు వివిధదేశములందలి ప్రాచీన నవీన గ్రంథాలయోద్యమములను గూర్చి విపులముగా జెప్పిరి. అధ్యక్షులు ఆంధ్రదేశమందలి గ్రంథాలయములనుగూర్చియు, గ్రంథాలయములను ఉపయోగకరముగ చేయదగు మార్గములను గూర్చియు విపులముగా జెప్పిరి.

ఈసంఘాధ్యక్షులగు శ్రీ మోచర్ల రామచంద్రరావు పంతులుగారి విజ్ఞప్తిపత్రమునుండి ఈక్రిందివిషయములను ముద్రించుచున్నారము.

ఈ సంఘము 1904 సంవత్సరములో కొంతమంది యువకులచే సంఘసేవ, దైవభక్తి మొదలగు ఆదర్శములతో స్థాపింపబడెను. 1914 వ సం॥ రములో దీని కుపకరణముగా ఒక గ్రంథాలయమును, పఠనమందిరమును పురజనుల కుపయుక్తముగా నుండునటుల చేర్చబడెను. 1915 వ సంవత్సరమునుంచియు యీ సంఘము ధర్మకార్యములయందును, సాంఘిక విద్యావిషయములయందును పాల్గొనుచున్నది.

ఇప్పటికి గ్రంథాలయమున 8000 గ్రంథములు గలవు. స్త్రీలు కూడ చాలమంది యీ గ్రంథాలయము నుపయోగించుచున్నారు. అరువది పత్రికలు వచ్చుచున్నవి. కొంతకాలమునుంచి యీ సంఘమునకు తగిన భవనమును ఆర్జించు ప్రయత్నములు జరుగుచుండెను. అందుమీదట ఉదారస్వభావులును, ధార్మికులును, అనేక ధర్మకార్యములు చేసినవారును, జమీందారులును అగు శ్రీమోతే గంగరాజుగారిని అర్థింపగా 15 వేల రూప్యముల విరాళమును యీ సంఘ భవ

నమునకు యిచ్చెదమనిరి. అందుమీాద ఈ సంఘమువారు గ్రంథాలయ మునకే గాక ఉపన్యాసము లిచ్చుటకున్నూ, అప్పుడప్పుడు నాటక ప్రదర్శనములకు కూడ ఉపయుక్తముగ నుండుటకును తగిన భవన నిర్మాణమునకై ప్రయత్నించిరి. పురపాలక సంఘము 2000 చతురపు గజముల–ఇప్పుడు భవన నిర్మాణము గావించిన యీా స్థలమును సం॥ రము 1 కి రు 100 లు అద్దెయిచ్చు పద్ధతిని, గవర్నమెంటువారిచే విధించబడు నేలపన్ను యిచ్చు పద్ధతిని, 30 వత్సరముల కౌలుతీరి పన్నును మరల మార్చుపద్ధతిని, శాశ్వతకవులుకు యిచ్చిరి. 1919 వ సంవత్సరములో యీా స్థలము యీా సంఘమువారికి వప్పచెప్పిరి. శ్రీ గంగరాజుగారు 26–11–20 తేదీని భవననిర్మాణమునకై ప్రారంభించిరి. అప్పటినుండియు యీా భవన నిర్మాణము పూర్తి యగుటకు 8 సంవత్సరములు పట్టినది. ఇంత ఆలస్యమునకు కారణ మేమన యీా సంఘమునకు వ్రాసినకవులునందు పురపాలకసంఘమువారికి సం॥ 1 కి యిచ్చు రు 100 లే గాక గవర్నమెంటువారిచే విధించబడు నేల పన్నుకూడా యిచ్చు పద్ధతియే. దీని ననుసరించియే 1922 సంవత్సరమున రివిన్యూ బోర్డువారు యీా సంఘమునకు సంవత్సరము 1 కి రు 400 లు పన్ను విధించిరి. ఈ హెచ్చుపన్ను* విధించుటచే 5 సంవత్సరములవరకును భవన అసంపూర్తికని, అనవసరముగ బోర్డువారికిని, సంఘమువారికిని, పురపాలకసంఘమువారికిని ఉత్తర ప్రత్యుత్తరములకును తుట్టతుదకు పురపాలకసంఘమువారికిని యీా యువజనసంఘము వారికిని దావాలకుకూడా కారణమైనది. తుదకు గవర్నమెంటువారు పట్టణస్థలములమీాద నేలపన్ను విధించు ముఖ్యసూత్రమును శాశ్వతమైన పునర్విమర్శన చేసి ఈ సంఘము చెల్లించ వలసిన పన్నును రు 2-9-0 లకు తగ్గించిరి. ఈ హాంశము యీా ప్రాంతమందలి దేశమందంతటను ప్రతివాని హృదయము నాకర్షించినప్పటికిని తుట్టతుదకు తేలిన ప్రభుత్వమువారి నిశ్చితాభిప్రాయము అనేకభవనములను కట్టించు దాతల హృదయములను సంతోషదాయకములుగ జేసినది.

ప్రభుత్వమువారు ఈ విధముగా పన్నును తగ్గించినారనిన శుభవార్త తెలిసినతోడనే యీా భవనదాతలగు శ్రీ గంగరాజుగారు సం

వత్సరము క్రిందట అప్పటి కసంపూర్తిగా నున్న యీ భవనమును పూర్తిచేయించుటకు మొదలుపెట్టి షుమారు రు 50,000 ల వరకు వెచ్చించి యీ దివ్యమైన గ్రంథాలయమును కట్టించి యిచ్చిరి. ఈ భవనము 750 చతురపు గజముల వైశాల్యము కలిగి అంతయు రాతిచే కట్టబడి బరోడారాజ్యమందలి గ్రంథాలయముల నమోనా ననుసరించి యున్నది. ఇందు 90 చతురపు గజముల వైశాల్యము గల పఠనమందిరము గలదు. దీని ననుసరించియే దీని పై భాగమున పుస్తక భాండాగారమున్నూ కలదు. వీటికి వెనుకనున్న 590 చతురపు గజముల వైశాల్యముగల ఉపన్యాసమందిరము 800 మంది సభ్యులు కూర్చొనుటకు తగినట్లుగను, సినీమా, నాటక ప్రదర్శనముల కుప యుక్తమైనదిగను నున్నది. ఈ మందిరమున కిరుప్రక్కలను స్త్రీలకు కూర్చొనుటకు ప్రత్యేకముగ గ్యాలరీ లమర్చబడినవి.

---

## పరబ్రహ్మాంధ్రభాషా నిలయము, భువనగిరి.

నిజాంరాష్ట్రం నల్లగొండజిల్లాలో చేరిన భువనగిరియందు 1924 సంవత్సరమున యీరాజ్యఆంధ్రగ్రంథాలయోద్యమస్థాపకు లనబడు శ్రీ మాడపాటి హనుమంతరావుగారి ప్రోత్సాహమున ఈ గ్రంథాల యము స్థాపింపబడి సుమారు మూడు సం॥ లు నడుపబడి కొన్ని కారణ ములవల్ల శ్రద్ధతగ్గి ౨౬౦ పుస్తకములు, రు ౨౭ లు నిలువ, మరియు కుర్చి మేజు బెంచీలతో నిలచియుండె-అభిమానధనులగు శ్రీ తాడేపల్లి మృత్యుం జయరావు పంతులుగారి యాదరణలో పునరుద్ధరింపబడి వీరి యాధిపత్య మున నే 5 ఫిబ్రవరి 1929 తేదిన సభ గావింపబడి నూతన కార్యనిర్వా హకవర్గముయొక్క ఎన్నికలు జరిగినవి. కార్యక్రమ నిబంధనలు జరిగిన తర్వాత యీగ్రామ పటేలుగారగు యెడ్ల వెంకటాద్రిగారు తమ యింటిని గ్రంథాలయము నిమిత్తము దానపూర్వకముగా నిచ్చి తమ ఆంధ్రభాషాపోషణత్వమును వెల్లడించి శాశ్వతకీర్తిని జూరగొనిరి.

—టి. ధర్మయ్యాచార్యులు.

# శ్రీస్వరాజ్యలక్ష్మీ పుస్తకభాండాగారము,
## బెజవాడ.

ఈ గ్రంథాలయము ప్రప్రథమమున అయ్యంకి వేంకటరమణయ్యపంతులవారి గృహమున కొందరు బాలురచే 1924 సంవత్సరమున స్థాపింపబడినది. మొదట షుమారు నూరు చిన్నిపొత్తములతో స్థాపింపబడి క్రమముగా పలువురి ప్రోత్సాహముచేత ఒకసంవత్సరమునకు షుమారైదువందల గ్రంథరాజములతో విరాజిల్లి రక్తాక్షినామసంవత్సరమున వార్షికోత్సవము గావింపబడి ప్రఖ్యాతిగాంచినది. నేటికి షుమారు వేయిపొత్తములతోను ఆంధ్రి కృష్ణా ఆరోగ్యప్రకాశికాది పత్రికారాజములతోను నిండియున్నవి. ఇటీవల భాండాగారాభివృద్ధినిమిత్తము శ్రీయుత పువ్వాడ శేషగిరి రావుగారి యాధిపత్యమున నొక సభ గావింపబడి, పఠనాదిసౌకర్యార్థము బెజవాడ హిందూ హైస్కూలునకు సమీపమున నొకగృహమందు ప్రవేశపెట్టబడి యున్నది. ప్రస్తుతము కొలదిమంది చందాదారులుమాత్రమే గలరు. కాన మహనీయులందరును భాండాగారము నభివృద్ధిపరుప బ్రార్థన.

—గుండేపూడి రామకృష్ణశర్మ,
సహాయకార్యదర్శి.

---

# శ్రీలజపతిరాయి విద్యానిలయము,
## తుమ్మపూడి.

ఈ విద్యానిలయమునకు డాక్టరు సూర్యదేవర సంజీవరాయణం యం. డి. అండ్ హెచ్. యస్ గారు అధ్యక్షులు. వీరిచే స్థాపింపబడిన శ్రీ సీతారామ భక్తసంఘమునకు ఒక శాఖగా ఏర్పరచబడినది. ఇందు షుమారు 40౧ గ్రంథములు గలవు. 30 పత్రికలు వచ్చుచున్నవి. యువకులు ప్రతినిత్యము పగలును రాత్రియందునుగూడ వచ్చి పత్రికలు, పుస్తకములు చదువుచుందురు. ఆంధ్రపత్రికగాక మిగతా పొత్త

ములు పత్రికలన్నియు శ్రీ సంజీవరాయణంగారే తెప్పించి ఇచ్చుచున్నారు:

— సూ. నరసింహనాయుడు, కార్యదర్శి.

---

## శ్రీ శారదా పుస్తకభాండాగారము-నాగిరెడ్డిపల్లె.

కదిరి తాలూకా నాగిరెడ్డిపల్లె శ్రీశారదా పుస్తకభాండాగారపు అధ్యక్షులు మాచిరెడ్డి వెంకటస్వామిరెడ్డిగారిచే ఆంజనేయ భజనసంఘ మొకటి స్థాపింపబడినది. ఈ భజనసంఘములో సుమారు 80 మందివరకు సభ్యులు చేరినారు. ఈ భజనసంఘమువారు ప్రతిదినము భజన చేయుచున్నారు. డిశంబరు నెల 23, 24 తేదుల యందు ఆంజనేయజయంత్యుత్సవము జరుపబడినది. గ్రామశాంతి నిమిత్తము గడిచిన నెల 23 వ తేది రాత్రి శ్రీయుత పి. కృష్ణారెడ్డిగారి వలన సీతాకళ్యాణము, రుక్మాంగద చరిత్రములు, తెల్లవారి 6 గంటల వరకు ఆంజనేయాలయమువద్ద హరికథాకాలక్షేపము జరుపబడినది. గ్రామశాంతి నిమిత్తము సుమారు 4000 మందికి అన్నదానము గావింపబడెను. అనేకమంది చుట్టుపట్ల గ్రామవాసులు వచ్చి చూచి ఆనందించిరి.

19-1-29 తేదిన శ్రీవేమనజయంత్యుత్సవము మిక్కిలి జయప్రదముగ జరుపబడినది. సాయంత్రం 3 గంటలకు వేమనపటమును భజనతో ఊరేగింపు జరుపబడినది. 5 గంటలకు గ్రంథాలయమువద్ద మాచిరెడ్డి వెంకటస్వామిరెడ్డిగారి అధ్యక్షతక్రింద గొప్పసభ జరిగినది. దైవప్రార్థన జరిగినతరువాత అధ్యక్షులు వేమనజీవితము, కవిత్వము, వేదాంతము-వారిపద్యములు విమర్శగాను వినువారికి ఉత్సాహకరముగాను వుండునట్లు ఉపన్యసించినారు. ఆరాత్రి 8 గంటలకు శ్రీ పించర్ల సార్ధనాగప్పగారివలన ప్రహ్లాదచరిత్ర హరికథాకాలక్షేపము జరిపించినారు. సభ్యులకు గంధపుష్ప తాంబూలములతో సత్కరింపబడినది. జయంతి చాలాజయప్రదముగా జరుపబడినది.

—సాదు గెంగిన్న, భజనసంఘ కార్యదర్శి.

—o—

# గ్రంథస్వీకారము.

డాక్టర్ కొత్తపల్లి బుచ్చయ్యశర్మ (పొలమూరు, అత్తిలిపోస్టు, ప. గోదావరిజిల్లా.) 7గారిచే రచింపబడిన ఆంధ్రవైద్య గ్రంథములు ఈక్రింద వివరింపబడినవి మా కార్యాలయము చేరెను, (1) తెలుగు మెడికల్ హాండ్ బుక్కు: ఇందు ఆనందభైరవి, సన్నిపాతభైరవి మొదలగు ఔషధములను భస్మములను చేయు విధానములు తెలుపబడినవి. (2) ఆంగ్లేయ వైద్యరహస్యము: కొన్ని సాధారణ ఆంగ్ల ఓషధుల ప్రయోగములను తెలుపబడినవి. (3) కుటుంబ చికిత్సాదర్పణం: చిన్నలకు పెద్దలకు తటస్థించు సామాన్యవ్యాధులకు, ఆకస్మికబాధలకు వైద్యవృత్తియందుండు వైద్యులసహాయమును కోరకయే ప్రతియింటం జేసికొనదగిన సులభచికిత్సలను దెలుపును. (4) ఆసవారిష్టదీపిక: ఆసవములు, అరిష్టములను సిద్ధము చేయు మార్గమును తెలియజేయును. ఓషధుల ప్రయోగములను యోగములను వివరింపబడినవి. (5) ఓషధీగుణ పంచభాషి: అయిదు భాషలలో ఓషధుల నామముల నిచ్చును. ఓషధుల గుణములను తెలుపును.

రజతోత్సవసంచికలు: శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయము, (హైదరాబాదు) వారిచే ప్రకటింపబడిన రజతోత్సవసంచికలు అందినవి. ఈగ్రంథాలయముయొక్క రజతోత్సవసందర్భమున ఈసంచికలు ప్రకటింపబడెను. భాష, చరిత్రము, పరిశోధనము మొదలగు విజ్ఞానవిషయములు ఇందు గ్రోడీకరింపబడియున్నవి. అధికధనవ్యయముతో పెక్కుపటములు జేర్చబడియున్నవి. ప్రతిగ్రంథాలయమును అలంకరింపవలసిన అమూల్యగ్రంథము. ఈ రెండుసంపుటములును వెల రు 3 లు అయినను రు 2 లకు యిచ్చుచున్నారు.